# వి ష య సూ చి క

# నెలవంక

(Approved for the use of libraries
Vide Fort St. George Gazette, 19-11-1929.)

# ఇంద్రచాపము

(ఖండకావ్యసంపుటములు)

కృతికర్త:
ఆవంత్స వేంకట రంగారావు, బి.ఏ.,బి.ఇడి. (సాహితీసమితి)

విజయనగరము,
1949.



[వెల ౧—౪—౦

# అంకితము

## జననికి, జనకుని స్మృతికి

తల్లీ ! నీవొక దివానుగారి మనుమరాలివయ్యు, నొక దివానుగారి కోడలివయ్యు, బారిష్టరుగారి భార్యవయ్యు ౨౩ వ సంవత్సరమున భర్తను గోల్పోయి యనేక శ్రమలకోర్చి మమ్ములను బెంచి పెద్దచేసి యీ మంచి స్థితికిఁ దెచ్చినందుల కీచిన్నిపొత్తమును నీకు ప్రేమాంకితము జేయుచున్నాడను.

తండ్రీ ! జీవించిన ముప్పదిరెండు సంవత్సరములలో నీవు నిజమైన దేశభక్తుఁడవని ప్రజలకుఁ దెలియపఱచినావు. ఆంగ్లదేశములో భారత స్వాతంత్ర్యముకొఱకుఁ బనిచేయఁ జేతినుండి రక్తముఁదీసి సంతకము చేసినవారిలో నీవొకఁడవు. నీ దేశభక్తికిని నీపవిత్ర స్మృతికిని దగిన యుపాయనము నేనియ్యలేకపోయినను నీచిన్నిపొత్తమును ప్రేమపూర్వకముగ నీకర్పించుచున్నాను.

జేసి కవితారచన యేమియు సాఁగలేదు. నే నుద్యోగములోఁజేరిన యా సంవత్సరమందే చిత్రలేఖన మతిబలవంతముగా విడిచిపెట్టవలసివచ్చినది. కాని తరువాత నేనప్పుడప్పుడు రచించిన పద్యములు నాభార్య జీవితకాలములో నామెకంకితముగఁ బ్రకటింపఁ దలఁచినందున నేడుఖండకావ్యములు "ఇంద్రచాపము" అనుపేరను "రాజదర్శనము" "నిషాదుఁడు" అను కావ్యములు, బరిశిష్టములుగను ముద్రింపించి బ్రకటింపఁబడినవి. "రాజదర్శనము"న నా కళాకృషికిఁగల్గిన ప్రబలప్రత్యూహపరంపర సంక్షిప్తముగ వర్ణింపఁబడినది. నిరంతరదుఃఖాగ్నికీలలు వెదచల్లిన విస్ఫులింగములని "ఇంద్రచాపము"లోని ఖండకావ్యములను బాఠకులు తెలిసికొందురుగాక; ఉద్యోగపుస్థిరత్వము— అమితకళానురక్తి అను రెండు బలవత్తరమైన శక్తులమధ్య నాచిత్తము డోలాయమానమై విహ్వలమై యిప్పటివరకు నెంతబాధపడినదో భగవంతునికెఱుక. నేను జిన్నతనమునుండియుఁబద్యములల్లుట యలవడినవాడనుగాను. ఇంటరుసీనియర్ తరగతిలోఁ గొంచముగఁ నావిద్యనేర్చి బి. ఏ., తరగతిలో నాంగ్ల కావ్యపఠనముచేతను, బూర్వకవులయు నప్పటికి బ్రసిద్ధిఁజెందిన యాంధ్రనవ్యకవులయుఁ గావ్యపఠనముచేతను నామనస్సునందుఁ గల్గిన సంచలనము. 30 శీర్షికల క్రింద పద్యములుగ రచింపఁబడి యందు 26 శీర్షికలు గలవి "నెలవంక" యను సంపుటముగ బ్రకటింపఁబడినవి ఆరోజులలో యతిప్రాసములేక పద్యములు వ్రాయవలెనను వాదముగలదు. ఆధోరణిలోని పద్యములుగొన్ని "నెలవంక" ప్రథమముద్రణమునగలవు. ఈముద్రణమున గొన్ని క్రొత్తపద్యములు కూర్పఁబడినవి. వెనుకటి పద్యములు గొన్ని తీసివేయఁబడినవి. మరికొన్ని మార్పులుచెయ్యబడినవి. వీని యాంగ్లీకరణమును బ్రకటించిన మాటయెవరికి దక్కునో.

ఇట్లు
విధేయుడు,
ఆవంత్స వేంకట రంగారావు,
పురపాలకోన్నత పాఠశాల.

విరోధి. ఆషాఢము,
విజయనగరము,

—

# విన్నపము

(మొదటి ముద్రణమునుండి)

ఇయ్యది ఖండకావ్యసంపుటము. ఇందలి ఖండకావ్యములలోఁ గొన్ని భారతి, జయంతి, సుజాత, ఆంధ్రభారతి, లలిత, మున్నగు పత్రికలలో బ్రకటింపఁబడినవి. అందుల కాయాపత్రికాసంపాదకులకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. అప్పుడప్పుడు వీనిలోని పద్యములు చూచి మద్గురువర్యులగు మల్లాది వేంకట విశ్వనాధశర్మగారును డాక్టరు బుఱ్ఱా శేషగిరిరావుగారును నడిదము రామారావుగారును నాకుమిక్కిలి ప్రోత్సాహముగలిగించిరి. శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు 1927 సంవత్సరములో ఆంధ్ర విశ్వవిద్యాలయము పక్షమున మా కళాశాలను జూచుటకు విజయనగరము వచ్చినప్పుడు శేషగిరిరావుగారు కవితాప్రియులగు రెడ్డిగారికి నాపద్యముల వినిపింప నవకాశము గలిగించినారు.

నేను విజయవాడ వెళ్లినప్పుడు బసవరాజు వేంకటప్పారావుగారింటఁ బ్రసిద్ధపురుషులగు వేలూరి శివరామశాస్త్రిగారును పద్యములయందుఁ గొంచెము గుణముండుటచేతనో మద్గురువులు శిష్యవాత్సల్యముచేతనో కవితారచనకు నన్ను ప్రోత్సాహ పఱచినందులకు వారికిఁగృతజ్ఞతాపూర్వకవందనములాచరించుచున్నాను.

ఇట్లు పండితులచేతను నవ్యకవిమిత్రులచేతను బ్రేరితుఁడనై యప్పుడప్పుడు నాచేరచియింపఁబడిన పద్యములను సంపుటీకరించి నాప్రథమకావ్యమగుటచే ధ్వనిప్రధానమగు "నెలవంక" యను పేరఁబ్రకటించితిని. ఇందలి ప్రమాదములను బండితుల యుదారపరిశీలనమునకే విడిచిపెట్టుచున్నాను.

ఇందలి పద్యములు రసికజనాహ్లాదమును గలిగింప జాలినచో నదియే నాకు పదివేలు.

విభవ, మాఘ శు ౩ మంగళవారము,
విజయనగరము.

ఇట్లు
అవంత్స వేంకట రంగారావు

# అభిప్రాయములు

౧ శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు

Andhra University,
Bezwada, 14th March 1927.

My Dear Jayakar,

This is to introduce to you Mr. A. V. Rangarao of the senior B. A. class Vizianagram. He seems to have a taste for painting and has executed some works of considerable promise. He wants to study in Bombay. I shall be glad if you can introduce him to Dhurandhar or otherwise put him in the way of getting the necessary training.

With best regards,

Yours sincerely,
C. R. Reddy.

౨ కీ. శే. దువ్వూరి రామిరెడ్డిగారు

30-4-1929.

మీ " నెలవంక " అమృతపూర్ణమైన భావి పూర్ణచంద్రోదయమును స్ఫురింపఁజేయుచున్నది. మీకవిత్వమునందు భావనవ్యతయేగాక గానగర్భితలలితపదవిన్యాసము నాకు గోచరించినది మీకవితారసప్రవాహ మనుదినవిజృంభమాణమయి రసపిపాసువుల దాహ ముపశమింపఁజేయుచు ఆనందసముద్రమును సంగమించుగావుత మని సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను. గ్రంథముద్రణము గూడ చక్కఁగానున్నది.

మీపద్యములను ఇంగ్లీషులోకి తర్జుమాచేయించి Dr. Wheeler గారికి వినిపించుటవలన ఆధునికాంధ్రకవిత్వమును గుఱించి వారు కొంత గ్రహించియుందురని తలంచెదను. వీలైనయెడల మీ ఖండకావ్యములలో మిక్కిలి రసవంతమైనవానిని ఇంగ్లీషులోనికి తర్జుమాచేసి గ్రంథరూపమున ప్రకటించుట మంచిదని నాతలంపు. (14-8-1948)

౩ కీ.శే. కూచి నరసింహముగారు బి. ఏ.,

2 మే 1929.

I have had the pleasure of reading critically the nice little book " Nelavanka " written by Mr. Avantsa Venkata Rangarow B. A.

The ideas and sentiments are very happy and the language is elegant and flowing. I find in the booklet clear indications of a genuine poet and wish the young author all success and popularity in the literary line he has chosen.

౪ నిడమర్తి సత్యనారాయణమూర్తిగారు బి.ఏ.,

1 మే 1929.

ఈ మధ్య బయలుదేరిన చాల భావకవితా పుష్పములు అర్థముగాని దారితెన్నులుగాని లేక చదువుటకు చావుగానున్నవి. మీ " నెలవంక " —దానికడుపుచల్లగుండ— సులభముగ నర్థమగుచు మీరనుకొనినదానిని అద్దములోని ప్రతిబింబమువలె స్పష్టముగ తెలియజేయుచున్నది. లోన అనుకొనినది సూటిగా చెప్పగలరు మీరు. " ఊద్పు " "రేమీలనాతి" "వర్షకాలము" " గాలిగొల్లడు " మొదలగు కావ్యములు అనందసంధాయకముగనున్నవి. వానిలో మీభావము తేటగా తెల్లమైనది.

మీ పుస్తకమును నాకు స్నేహితులగు శేషాద్రి రమణకవులకు చూపితిని. వారును నాఅభిప్రాయములతో నేకీభవించిరి. మీ ప్రథమ కావ్యము మీ భవిష్యద్యత్నములు మిక్కిలి జయప్రదములు కాగలవను నాశపుట్టించుచున్నది.

౫ "The Hindu" 1 May 1929.

This book ( Nelavanka ) contains twenty six poems which are more or less lyrical. There is spontaneity of verse in " The Rainy Season" "Bond of Love" "Secret" "and" To my love ". The style is simple and charming and this young author has been rightly encouraged by Andhra Scholars like Dr. Burra Seshagiri Rao, M. A., P. H. D., Adidam Rama Rao, and Malladi Venkata Viswanadha Sarma.

౬ ఆకెళ్ల అరుణాచలశాస్త్రిగారు. సంస్కృత కళాశాలాంధ్రోపాధ్యాయుఁడు,
విజయనగరం. 23-10-1932.

అయ్యా,

"నాకూర్పఁబోవు గద్యపద్య ప్రబంధమునఁ దను "నెలవంక" లోని (1) గాలి గొల్లఁడు, (2) వర్షకాలము (3) వృక్షవర్ణములు అను నీమూడు కావ్యములను స్నేహ ధర్మముచే నొసగినందున వేసికొనుచున్నాను."

౭ డాక్టరు కజిన్స్‌గారు,

From

The Art Adviser's Office, July 24, 1940.
Trivandrum.

Dear Sir,

I wish I knew Telugu so as to be able to appreciate your verses in their proper language. The best way to do so otherwise is to have the closest line-by-line translation into English. Rendering of your poems into English verse forms by others only distort your meaning and feeling, as they cannot possibly be as close to the original as a straight prose translation. It was through such translations that I got to appreciate the essence of Mr. D. Rami Reddi's Telugu Poetry. I shall be glad if you will kindly convey my greetings to him.

Yours sincerely,
(Sd.) J. H. Cousins.

౮ Dr. J. H. Cousins. Ghat View, Kotagiri,
Nilgiris, Oct. 10, 1943.

Dear Mr. Rangarao,

The direct translations are far superior to the English versifications.........Publication in book form is difficult these days, but your work should be brought out; if and when this happens I shall be happy to possess a copy.

Yours sincerely,
J.H. Cousins.

౯

"Ghat View"

Kotagiri; Nilgiris,
October 21, 1943.

Your letter of October 16 received yesterday. When the text of your book of translations is in page-form, send me a copy of the proofs, and I shall write a short foreword.

J. H. Cousins,

౧౧ కీ॥శే॥ డాక్టరు ఆనంద కుమారస్వామిగారు

* Museum of Fine Arts
Boston 15. Messachusetts.
Jan. 6, 1945.

My dear Mr. Rao,

I can see that he must be a real artist and has valuable thoughts to be expressed.

Very sincerely,
A. K. Coomaraswamy.

౧౨ శ్రీశ్రీశ్రీ కళాప్రపూర్ణ విక్రమదేవ వర్మ
మహారాజావారు.

Fort, Jeypore (Orissa)
3rd of April, 1949.

Mr. Avantsa Venkata Rangarao, B.A., B.Ed., of Vizianagram has presented me a painting of "Saraswati" prepared by him and also recited certain verses of his composition.

The painting is very artistic and attractive. The verses are poetic and have a good flow.

I wish him success.

(Sd) V.D. Varma,
Maharajah of Jeypore.

---

* Extract from the letter addressed to my brother-in-law Dr. M. N. Rao. M. B. B.S., M. P. H., Dr. P. H. (Harward) Assistant Professor of Industrial Hygiene, Calcutta.

# సన్మానపత్రము

పాయాదావంత్సకులాం । భోనిధి శీతాంశు రంగరాయకవిం॥
లక్ష్మీ సుహాసచంద్రిక । యా, నీరాజితతనూ రమానాథః ।
ఆధునిక భోజరాజః । శ్రీ విక్రమదేవవర్మ భూపాలః ॥
కవితాధారాయాం త్వం । చాంధ్రాభినవాద్య కాళిదాసోఽసి॥
తరుణీ మధురాధరపానవశా । ద్భరితామధున్యాకవితా లసతీ॥
వదతీహజనః పరిణామకతాం । త్రియుగైరపిమాభి రసౌసఇతి॥
తన్నిరూపయతి త్వ త్ప్రబంధకే। రూపకోపితవ రంగసత్కవే॥
తావకీనకవితా త్వయాయుతా । రాజతేహి మణినాంగుళీయవత్॥

## తెనుఁగు

గీ॥ చూచినాఁడను నీకావ్యసూక్తినార్య! । మేటి యావంత్స రంగరాణ్మిత్రవర్య ।
తొణకుచుండె స్వభావోక్తితోఁడ రూప । కమ్ము తావకకృతులం దగణ్యముగను॥

గీ॥ పోకడలు మూర్తికవి రామభూషణు నుడి । సాటియైనను పాకమ్ము సరణి పెద్ద ।
నార్యకవితకు సాటి మాధుర్యగరిమ । ముక్కతిమ్మన సూక్తితోఁ బొందుఁజేయు॥

గీ॥ వీక్షణము సేయఁగా ద్రాక్షమాక్షికముల । కెనయగుచుఁ బండితాళుల మనములకును।
బామరులకును హృద్యమై భవ్యసుకృతి । యలరు నాచంద్రతారార్క మవనియందు।

కం॥ ఆయతమతి గృష్ణద్వై। పాయనుఁడు శుభంగిరికులుఁ డాదరమొప్పన్।
శ్రీయుత నీయోగ్యతఁగని । గేయమ్మగు పత్రమిచ్చెఁ గెరలుము కీర్తిన్॥

కవిమండలమండన
మంగళగిరి కృష్ణద్వైపాయనాచార్యుఁడు,
మైసూర్ విద్వాన్,
విశ్రాంతిఁగన్న సంస్కృతాంధ్రోపాధ్యాయుఁడు.

విజయనగరము,
19—7—49.

———

# * భరతఖండము

గౌరీశ కాంచనగంగాచ్ఛ శిఖరాలు
ఖండ విఖ్యాత శృంగములుగాఁగ,
ఘనసార కస్తూరికా సౌరభోదార
కాశ్మీరసీమ ముఖమ్ముగాఁగ,
బ్రహ్మపుత్రా గాంగ బహుళోర్వికాయమై
తత వంగ వసుధ యూధమ్ముగాఁగ,
గళకంబళమ్ము కొంకణ గుజరాతులు,
బర్మయు లంకయుఁ బాదములుగ,

మలయ పుచ్ఛమై జీరాడ, మమతతోడఁ
బ్రాచ్య పాశ్చాత్యభేద భావములులేక
క్షీరము లొసంగి జనులఁ బోషించినట్టి
భరత కామధేనువ ! నీకు వందనమ్ము.

* ఈ పద్యము ౧౯౪౭ ఆగస్టు ౧౫ తేదీకి ముందు వ్రాయబడినది.

# పవిత్రస్మృతి

పద్మ ముకుళానఁ గర్ణిక పగిదినొదిగి
వామలూరున జపియించి రామగాథ
నల్లి ఋషియౌచుఁ గావ్యమ్ము ఇల్లుమనెడు
సూక్తిఁ దలఁపించు వాల్మీకి సుకవిఁ దలఁతు.

ప్రకృతి చిత్రాల రమ్య దర్పణమనంగ
నమిత కరుణార్ద్ర విశ్వవిఖ్యాత ఖండ
కావ్య మొనరించి "మాకు" మార్గమ్ముఁజూపు
కాళిదాసకవీశాను గణనసేతు.

రాయినేడ్పించి కఠిన వజ్రమ్ముగూడ
బ్రద్దలై పోవు పోల్కి శ్రీరామచరిత
నాటకమ్ముగ రచియించి నవరసములఁ
గరుణ నెత్తిన భవభూతి గారవింతు.

# కృతజ్ఞత

మొన్నమొన్ననె యీపంట భూమియందు
నవనవంబగు కవనంపు నారునాటి
ఆరఁబండించు కవిమేఘు నభినుతించి
సన్నధాన్యము మీకిత్తు సరకుఁజూడ.

# కృష్ణా!

"చాలు మదీయ రాజ్యమ్ము, సంతసమయ్యె"
నంచు మేఘము సన్యసించు వేళ,
శరదాగమంబెంతో సౌఖ్యదంబని హంస
పథికుండు సంతోష పడెడు వేళ,
శబలిత పురుహూతచాపమ్ము మంజుమ
రీచిజాలముఁ బ్రసరించు వేళ,
సంఫుల్ల కేతకీ స్తబక సంతానమ్ము
కమ్మరజపుదిమ్ముఁ జిమ్ము వేళ,
స్వీయవదనమ్ముఁ బైకెత్తి శిశిరకరుని
చుంబనము సేయ సందర్భమ్ము చూచు వేళఁ
గృష్ణ! మృదువేణునాళమ్ముఁ గేలఁబూని
గానలహరిని దేలింప మేనుమఱతు.

విమల యమునానదీతరంగములయందు
భయద కాకోదరమ్ముఁ జంపంగఁబోయి
యిచ్చవిహరించి తని వచియింపదాని
నీల కీలాలమే సాక్షి బాలకృష్ణ!

శీతసమీరపోతములచేఁ జెలువొందుచు హాయినించు ప్రా
భాతికవేళలన్మురళి వాతెరనుంచి మనోహరమ్ములౌ
గీతములాలపింపుమని కేకియదే యెలుఁగెత్తి భూధర
వ్రాతపరీతరమ్య వనవాటికల న్నినుఁగూర్చి పిల్చెడిన్.

# గాలిగొల్లఁడు

మెఱపను దండమ్ము కరమందుఁబూని
జలదంబులనెడు మందలఁ దోలుకొంచుఁ
గొండ కొమ్ముల గాలిగొల్లఁడు మేప
మింటిపై నేదియో మెకము గర్జించె;
కరుణచేమందలఁ గాపాడనెంచి
ఋభురాజు చాపాన నభయమ్మొసంగఁ
జెదరినమందలఁ జేరదీయుటకు
గొంతెత్తిపిలిచెనా గొల్లఁడనంగ
మరకత వర్ణంపుఁ జటీయులనుండి
కేకి గొంతునసిఁగు కేకలేతెంచె.

# * వర్షకాలము

జలదసార్థము మరునభఃస్థలమునందు
సంచరింపఁగ ఛాయలుసాఁగె భువిని.
ధరణితోఁచెఁ బచ్చిక సముద్రములతోడ.
వర్షకాలమ్ము కన్నుల పండువయ్యె;

శ్రావణమాస ఖౌమదివసమ్ములఁ గాంతలు పుష్పవేణులై
తావులఁజిమ్ము వస్త్రములుదాల్చి పథమ్ముల గోచరించినన్
"భావకవుల్"రసార్ద్ర కవనమ్ములు సెప్పఁగఁ జిత్రలేఖకుల్
టావులపైని జక్కని పటమ్ములు వ్రాయ సుకాలమియ్యదే;

మేఘములు హోరుమంచు నమృతముగురియ
స్నానమాడి ధారల వృక్షసంచయములు
ధౌతమై శ్యామలములౌచుఁ బ్రీతిఁగొల్పె;
గర్భవతులైరి నిమ్నగాకాంతలంత;

ధారధారలఁ గాసారనీరములను
దరళ జలమౌక్తికములు నృత్యము లొనర్చె.
వృక్షములుఁ బర్వతములు నదృశ్యమగుచు
మరలఁగాన్పించె వర్షమ్ము విరళమైన;

మేచకసౌధవీథిఁ దమమీఁద ఛరించెడు నాదులో యనం
దోఁచె మహేంద్రచాపములు; తోషితకీరము లేఁగెముక్తనా
రాచములట్లు; తోయి కుధరమ్ములకుం దలపాగఁజుట్టె; వే
పూచెను నాగలింగసుమముల్ తరుకాంతల నాగరంబులై;

ప్రకృతి నూతనసౌందర్యపటిమఁ గాంచె,
జలములందున సంజరంగులు వెలింగె,
హాలికులు చేలుబిడ్డల నాదరమునఁ
బెంచుకొనుచుండి రమృతమ్ము పంచిపెట్టి;

కాలాంభోద మృదంగనిస్వనము లాకర్ణించి కేళీవనీ
సాలక్ష్మాజ విశాలశాఖ నిజభూషాదీపితంబౌచు నీ
వేళ న్నీలశరీరకాంతు లొలయన్ బింఛంబు శీర్షంబునన్
లీల న్నాట్యము సేయ నృత్యములు సల్పెన్ గేకి కృష్ణుండనన్;

నీలాకాశవిశాలభాసురమరున్నేపథ్యకాదంబినీ
కాలాచ్ఛాదన మాత్మపాణిఁ దొలగంగాఁద్రోసి సౌదామినీ
బాలారత్నము చూపె స్వర్గనగరద్వారంబులం దీసి డో
లాలీలాశయనోత్థదేవయువతీ లజ్జావిలాసంబులన్.

"A very picturesque, flavorous, and indigenous description".

James H. Cousins.

# ప్రేమపాశము

నిన్ను వీక్షింపవచ్చిన నిముసమందుఁ
దరుణి! నీయుంగరాల ముంగురులె నాదు
కాళ్లసంకెళ్లుగా మార కదలలేక
నీస్వరూపమ్ము ధ్యానించి నిలిచిపోదు!

అంతరములేని నీ జుట్టుటడవులందు
బెదరినప్పుడు పక్షినై యొదిగియుండి
పాఱు పాపటసెలయేటి పాటవించు
వేయి సంవత్సరమ్ములైన వెడలనిత్తు!

వేఁడివలవంత నే వేఁగువేళ నీదు
కన్నుకోనేటిలో నల్లకల్వఁ జూచి
కురియు నీచూపువెన్నెల శిరముఁ దడిపి
స్నానమొనరించి సుఖియించి మేనుమఱతు.

# వటుయోగి

ప్రబలమార్తాండ నిశితాతపమ్ముఁ గొంత
తొలఁగఁజేసిన దక్షిణానిలము వీచి
హాయి నొనగూర్చుచుండ వాహ్యాళిఁగోరి
సాంధ్యసమయమ్మునం దిష్టసఖులతోడ
బయలుదేరఁగఁ బర్వతప్రాంతములకు
గగనపథమంత జలధరాక్రాంతమయ్యె;
స్తనిత నిర్ఘోషముల ధరాధరములెల్ల
మారుమ్రోయఁగ నొడలు కంపమ్మునొందెఁ
గాని యిష్టగాఢ సమాధి మేనుమఱచి
గగనవీథికి నెత్తిన కరచయమ్ము
ఖగకదంబక వాసయోగ్యమ్మైన
నిలయములుగాఁగ, నరుణమై యలకరాజి
జడలుగాఁగట్టి భూమిపై జారియూఁగఁ
దనువువల్మీక వితతికిం దావుగాఁగ
సంతతాభ్యాస యోగదీక్ష జడుండు
వటుతపోధనుండు పలాశవసనధారి
యువగతుంగశయోఁ నాకు సంధ్యాంతమందు.

# విరహోత్కంఠ

వర్షించుచయమ్ము పత్రమ్ములంజాలు
వాఱఁగ నీయశ్రుధారలంచుఁ,
బ్రిసవమున్న నివేఁడి వాడఁగ విరహాగ్నిఁ
బౌఁగిలిన నీముద్దు మొగమటంచ
దరుణామ్రకిసలయాంతరసీమఁ గోకిల
పలుక నీశ్రావ్యమౌ పిలుపటంచు
మలసి గుట్టలజాఱి సెలయేఱు రొదసేయ
నాసతో నీదు నిశ్వాసమంచు,

ననిలహతి జంటతీవ లుయ్యాలలూఁగ
నన్ను దరిఁజేరఁ బిలుచు నీ నవకమైన
కరములంచును దలపోసి కలతఁజెంది
నిన్నుఁగానక దుఃఖించి నీలవేణి!

వాతహతి నేలకురలిన పారిజాత
సూనరాజమ్ము వాసన లీనుచుండఁ
దావకీన శిరోవిచ్యుత కుసుమమ్ము
టంచు దానిని నౌదల నుంచుకొంచుఁ.

విచ్చియెత్తినవాడన విపినసీమఁ
దిరిగి రమ్యమౌ పూవుటోవరుల సర్ప
కంచుకమ్మొండు పడియుంటఁ గాంచినీదు
మదనలేఖ యటంచు నెమ్మదిఁదలంచి;

మొన్నటిరేయి నీవు తరుపూగము నీడల విశ్రమించి యె
న్నెన్నొవిధాల భీతహరిణేక్షణ ! చింతలఁ గుందికుంది యా
పన్నతనూర్చఁ బుణ్యపరిపాక వశమ్మున నిన్నుఁగంటి, మ
త్సన్నుత శీతభూమిధర సానువులన్ విహరింపవచ్చుచున్.

# ఎండకాలము

కొండయన్నకు సీమందు టెండలందుఁ
బండిపోయెఁ బచ్చని కేశపాశమెల్లఁ.
బడుచువాఁడయ్యు ముడుతలు వడినయట్టి
యొడలితో వృద్ధునట్లు కన్పడుచునుండె.
సారెసారెకు నోటిలో జలములాని
వేడియూర్పులు గాలిలో విడిచివిడిచి
దాహముంగొన్నవాని విధానఁదోఁచు.
నుడికిపోకుండఁ జల్లని గొడుగుపట్టి
మంచినీరిచ్చి తద్బాధ మరలఁజేయు
మొగిలు పనిమీఁద నెచటికో యెగిరిపోయె.
వర్షకాలానఁ జలిబాధఁ బాఱఁదోల
వాడు ధరియించినట్టి మవ్వంపుఁబట్టు
శాలువులు కాలచోర హస్తములఁబడియెఁ.
గట్టుకొనబట్టలేక యిక్కట్లు వడుచు
నాకసమ్మునఁ జూడ్కుల నలమఁజేసి
కరుణఁబుట్టించు నాభూమిధరునిమూర్తి:

వత్సరంబంతయుం గష్టపడిన తరణి
దాహమునఁ దటాకమ్ములు త్రాగివైచెఁ.
దోయమున మజ్జనములేక ధూళిపట్టి
చెన్నువిడనాడి కాన్పించుఁ జెట్టుగములు.
పులినతలములు వజ్రాల కలిమిగాంచె.
రావియాకులు సలసల రవములీని
సూర్యకిరణాల వెలుఁగొందెఁ జుక్కలట్లు.
నింగి నలుపెక్కెఁ బవనమ్ము నిలిచిపోయె
గడ్డిపసపయ్యె భూదేవి కళకువాటె
నెండకాలంపు మహిమమ్ము మెండుకొనగ.

# వృక్షవర్ణనములు

సంతతము సద్విజులకెల్ల సహజమైన
విమలతేజమ్ము మేన దీపించుకతనఁ
జెట్లలో వైష్ణవులు రావిచెట్లుగాఁగ
జువ్విచెట్టులు శైవులై నివ్వటిల్లుఁ

రక్తసంసిక్తహారితవస్త్రములు దాల్చి
శాతకరవాలపాళి హస్తములఁబూని
క్షత్రియులవోలె శౌర్యమ్ముఁ జాటుగాన
రాచవారు వృక్షములఁ దురాయిచెట్లుఁ

అచ్చటచ్చట మార్గమధ్యమ్ము లందు
నంగళులుపెట్టి విపులకాయములతోడఁ
బవడముల వర్తకముఁజేసి బ్రతుకుకతనఁ
జెట్లలోఁ గోమటులు మఱ్ఱిచెట్లుగావె;

జీవనము అంపములతోడఁ జేయుగానఁ
దాటిచెట్లు వడ్రంగులు తరులలోనఁ.
గరముల లవిత్రములఁబూను గారణమునఁ
జింతచెట్లను గాఁపులఁజేసెఁ గవిత;

నిశితకంటకాకీర్ణవినీలకాయ
రాజి నస్పృశ్యములయి పర్యంతభూము
లందు జీవించి సంతాపమందుఁ గానఁ
దుమ్మచెట్లు పంచములుగాఁ దోఁచునాకు;

వృక్షవర్ణమ్ము లోకకవి విరచితములు
పరిజలకల్పిత మీ పంచవర్ణములును.
దేవదేవుని కరుణార్ద్ర దృష్టియందుఁ
బంచముఁడుఁ గాఁపుబ్రాహ్మణుం డంచుఁ గలదె.

# చుక్కలు

సాంధ్యరాగదావానలజ్వాలలెన్నొ
మేదినీ చక్రముంగప్ప మీఁదికెగసి
గగనపథమంటు విస్ఫులింగమ్ములనఁగఁ.
నాకసమ్మనెడు జలాశయమ్మునందుఁ
బుట్టిదోఁచెడు బుద్బుద పుంజమనఁగఁ.
ఇంద్రుఁడను దివ్యకాంతి భక్ష్యంపుభ్రాంతి
వచ్చుచుండిన శలభసంపాతమనఁగ.
రాత్రిమాతంగిహస్తనిర్వాంతమగుచు
బయలఁగాన్పించు వమథు సంచయమనంగ
రాత్రి సుందరియనెడు జాలరిపడంతి
విమల గగనాబ్ధి నిరులు జాలములువైచి
క్రమముగాఁ దీసినట్టి వజ్రములనంగఁ.
దారకావళి దోఁచె నత్యంతకాంతి.

# రహస్యము

మనరహస్యమ్ము లింకేరు వినఁగరాదు
అతివరో! మెల్లగా మాటలాడు మిచట
నిర్జనంబైననేమి వనీతలమ్ము?
పొంచుచెవులతో లత వినిపోవునేమొ.

# మేలుకొలుపు

మేచకాంభోధివీచికామేదురోరు
చారుపర్యంకతలమందు నీరజాత
కాంతుఁడున్నిద్రుఁడయ్యె నింకెంతదనుక
చాన! నిద్రించెదీ పారిజాతవనిని ?
లెమ్మ! ప్రేయసి! వేళాయె లెమ్మ! లెమ్మ!
నిద్రమేల్కాంచి పరికింపు నీలవేణి!
ప్రకృతిసౌందర్య మీవేళఁ బ్రకటమయ్యె.
గర్భవతులైన కాంతల కరణి, మింట
మందగమనమ్ముతో మేఘమాల సాఁగు.
సలిలబింబితపాదపచ్ఛాయలెల్ల
నూర్మికారాజి నుయ్యాల లూఁగుచుండె.
నీరములఁజీల్చి మందసమీరు దూసి
పడవ బుగ్గలు పూరించి పయనమయ్యె.
క్షోణిభాగమ్ము వదనమ్ము సోఁకమ్రొక్కి
శకటములు నమ్రభావమ్ముఁ జాటుచుండెఁ.
బచ్చపాగాలు ధరియించి వరుసఁదీర్చి
యుద్ధ సన్నద్ధులయ్యెడు యోధులట్లు
తాళభూరుహవాటికా తతులుదోఁచు.
లెమ్మ ప్రేయసి! వేళాయె లెమ్మ, లెమ్మ!!
నిద్రమేల్కాంచి పరికింపు నీలవేణి!
ప్రకృతి సౌందర్య మీవేళఁ బ్రకటమయ్యె

# ఆహ్వానము

శుకపికగీతముల్ చెవులసోఁకిన సంతసమందకుండఁ దా
వక హరిణార్భకమ్ము పెఱవారలఁ గూడినఁజూడకుండఁ జం
పక వనకుంజసీమలను మంజులతాంతపరీమళమ్ములా
నక యిటులుండ నీకుఁదగునా! బిగువా! మృగశాబలోచనా!

పావనగౌతమీపులినభాగసమీపనికుంజసీమలన్
భావజపత్నిఁ బోలు నొకభామనుగాంచి యదేమొకాని శం
కావిలమానసంబున మహాటవిఁ గ్రుమ్మరుచుంటి నిన్ను సం
భావనసేయుచున్ మదిని మానిని! పిచ్చిబికారియట్టులన్;

ఆసమయమ్మునన్ సలిలయానము సల్పఁగరమ్ము, పూర్ణిమా
వాసర మంజుసంధ్య వసివాడిన దీనముఖమ్ముదేల, నా
యాసముతీరు మందమలయానిలపోత నిషేవనాన, నా
నాసుకుమారకీరకలనాదము వీనులకిం పొనర్చెడిన్;

చారుతరమ్ములై పఱఁగు శారదరాత్రులఁ గొండదండ సం
చారము సేయరమ్ము విలసత్తరుణేందుమరీచిమాలికా
పూరము మేనసోఁకఁ దరుపుంజమునీడల విశ్రమించి శృం
గారగిరిప్రదేశములఁ గాంచి సుఖింతము మానినీమణీ!

# ప్రభాతము

మళ్లు మళ్లుగాఁబైనుండు మార్గమందుఁ
బ్రత్తిపండిన నాటిప్రభాతవేళఁ
జాలతియ్యని మేఘాల పాలుఁత్రావి
బలిసి పొడవైన వరిచేలఁ బయనమైతిఁ;

వీచుచున్నట్టి పవమాన వీచికలకు
వరుస వరుసల వరిచేలు శిరములూపఁ
బచ్చలకడలి కెరటాలపైని దేలి
యాడి సుఖియించినట్లయ్యె నాత్మలోన;

చదలుజవరాలి చెక్కిలి జాజువారఁ
దూర్పుదిక్కున నుదయించి తొగలవైరి
పసిఁడి కిరణాలతోఁ బచ్చబాటనీటఁ
గల్పనముజేసి రమ్యమై కానిపించె;

మేడలన్నియు బంగారు మేడలయ్యె
నాకులన్నియుఁబుత్తడి యాకులయ్యె
జలముపైఁదేలి పసిఁడితేకులు చలింపఁ
దరలిపోయితిఁ బ్రకృతిసౌందర్యమరసి.

# ప్రేయసికి

నాటి సాయంతనమ్మున నాతి! నీవు
పాలుపితికింప మీగృహ ప్రాంగణమునఁ
దలుపుమాటునఁ దెలిపట్టు వలువతోడ
దంతపుంబొమ్మనా నిల్చి దారిఁబోవు
నాకు సాటిలేనట్టి యానందమొసఁగఁ
గనులతో నిన్నుఁద్రావితిఁగాని. రాత్రి
నిదురవోలేక దీపసన్నిధినిజేరి
చిత్రకారుఁడ నౌటచేఁ జిత్రమందు
నీస్వరూపమ్ము చిత్రించి నిన్నుఁదలఁచి
పద్యములువ్రాసి "సింహేంద్ర" హృద్యదీన
రాగమున వానిఁబాడి విశ్రాంతిఁగనక
యూరివెలుపల నొక మఱ్ఱియూడక్రింద
భయముఁగొల్పెడు తిమిర సంచయముఁజేరి
యుక్కుటూహాలు మదిలోన నుప్పతిల్లి
హృదయముఁ గలంచఁజీకట్ల కేడ్చియేడ్చి
కురియు కన్నీటనూడఁ జిగుర్పఁజేసి
చెట్టుచెవిలోన నాబాధఁ జెప్పిచెప్పి
బడలి వేసారి మతిమాలి యొడలుమఱచి

రేయి తొడమీఁద నిద్దురవోయి యుంటి,
నన్నుఁగని పెల్లు దుఃఖించి నభమునుండి
మొయిలు విలపించె విలపించె మోకలెన్నొ
పత్రములనుండి కన్నీరు పాఱెనపుడు
నన్ను మేల్కొల్పెఁ దజ్జీవనమ్ము లతివ !
నమ్మెదవొ లేదొ కాని నిజమ్ము సుమ్ము.

# రేమిలనాతి

ఝాలరిరేయిరో: ఝాలరి పదుచ !!
నభమను జలధికి నడచివచ్చితివి
తిమిరజాలముల పజ్రిములఁదీసితివి
అమ్ముటకై వాని నిమ్ముఁజేసితివి
వంతు వంతులువైచి పఱచియుంచితివి
శోభను విడనాడి మ్రిక్కెను గొన్ని
రంగుపోనివి కొన్ని రాజుకమ్మితివి;
ఒకనైన నాకిత్తువో లేదా యనుచుఁ
గనుఱెప్పవేయక కాచియుండంగఁ
దెల్లవారకమున్నె తెలివిఁదప్పించి
తరణికమ్ముడుసేసి తరలిపోయితివి
ఇంతకన్నను నాకు నేమిచేయుదువు.

# దేవాలయము

ఆమహోభూమిధరశృంగ మతిపురాణ
జీర్ణదేవాలయోత్తుంగ శిఖరమయ్యె.
సకలభూఖండములకు వర్షంబుగురియ
సంతమసకీర్ణదేవాలయాంతరమున
శైవులేనాడొ చేసిన పావనాభి
షేకనిష్యందనీరావశేషమయ్యె
గహ్వరమునుండి పాఱు నీఘననదమ్ము.
శ్రావణాంభోధరప్రవర్షంబుకతనఁ
బల్లవితమైన యీ తాళపాదపమ్ము
సవిధసంస్థాపితధ్వజస్తంభమయ్యె.
నన్ను వేష్టించుచున్న సంధ్యావసాన
సమయతిమిరమ్ము ధూమసంచయములయ్యెఁ.
దూలు దీపికలయ్యె ఖద్యోతవితతి:
అదిగో ! పారావతాళి విహాయసాధ్వ
తీవ్రసంచారములఁజేసి తిరిగివచ్చి
యారజంబులు వల్కు నీడాంతరముల.

# నీలి పఱపు

శకుని చాపంపు సాహాయ్యమునను
గాలిదూదేకుల బాలుండొకండు
చాపనిస్వానమ్ము జగమునిండంగ
వెలిమొయిళులదూదిపింజెలనేకి
అసితమేఘమ్మను వసనమ్ముఁదెచ్చి
మెఱపుఁదీఁగను బెద్దమేలిమిసూది
నంబరమ్మనెడు శయ్యను గూర్చియుంచి
చుక్కలుటాకాలు సొగసుగాఁబెట్టఁ
జందురుండు శయ్యపై శయనించుచుండు;
శయ్యజీర్ణించిన సమయమ్మునందు
గాలిదూదేకులబాలుండువచ్చి
దూదినెండనువైచి తొక్కఁబోనేకి
శయ్యను గూర్పఁగా సమయమ్ము వెదకు.
అందుచేతనె మనకాకాశమందుఁ
దెలతెల్ల దూదిపింజెలు దోఁచుచుండు.
ఇచ్చవచ్చినవేళ నేఁటేఁటఁ గ్రొత్త
క్రొత్త నీలిపఱపుఁ గుట్టించుకొంచుఁ
జందురుండు దానిపై శయనించి నవ్వు.

# పయఃపానము

చదల దీర్ఘసంచారము సలుపుకతన
జలదబాలుని దేహమ్ము ఛాయదొఱఁగి
ఆసితమై ఘర్మబిందుచయమ్ము రాల్చి
క్షుత్పిపాసార్తరూపమ్ముఁ జూపుచుండఁ
గరుణభూదేవి నిజధరాధరపయోధ
రముల దుగ్ధమ్ములాని విశ్రాంతినొందఁ
బిలువగా వాఁడు ప్రీతితో నిలకుదిగినఁ
బాఱె నవదాతమౌ పయోధారలపుడు
వరపయఃపానమునఁ దెల్లబడియె నతఁడు.

# ఊడుపు

స్వర్గగోదోహనమువోలె వానకురిసె,
నిర్మలములయ్యె దిక్కులు. నింగిపైని
బాలమీఁగడ మొగిళులు ప్రాఁకియుండె.
ఇంపుగాఁబాడె నా సెలయేఱుచెల్లి;

చేరువను గానిపించెడు చెఱువునుదుటి
బొట్టువలె నెఱ్ఱగల్వ చూపట్టుచుండె.
అలలపైనూఁగు తామరపాకు పళ్ళె
రములలో నీటిముంజెలు రక్తిగొల్పె;

పొలముదాపునఁ బెరిగిన మొగలికన్నె
మ్రుగ్గులనుబెట్టుచుండెఁ బుప్పొళ్ళతోడ.
నెమిలిపిట్టల తలలఁ బింఛెములనంగఁ
జోడివెన్నులెన్నెన్నొ తూఁగాఁడుచుండె;

చెట్టుతొడమీఁద నూఁగెడు చిన్నిపిడఁ
గూరుచుండి చూచుచునుంటిఁ గొండగములు.
మెల్లగా వీచుచున్న తెమ్మెరయొకండు
చేరి తియ్యని రావమ్ముఁ జెవులవైచె;

తొగరుకోకను దొడలపై బిగియఁగట్టి
పాదము మునుంగు నీటిలోపలను నిలిచి
బావ! బావా! యటం చేలపాట పాడి
ఊడ్పుచుండెను మాపల్లెటూరి పడుచు;

పసలనీనెడి నున్నని పనసతొనలఁ
బోలి పచ్చనై గాన్పించె బోటిమేను.
నాగుజోడులుఁ బవడాలు దీఁగగాని
ముగుదకేమియు విలువైన నగలులేవు;

తూఁగుటుయ్యాలపయ్యెద నూఁగునెడఁద
పల్లెల యమాయికతనెల్ల బయటఁబెట్టె,
పూచి వంగిన మందారపుష్ప మనఁగఁ
బొలఁతిమొగమునఁ గుంకుమబొట్టుదోఁచె;

పూజలో మేనుమఱచెడు పొలఁతిరీతి
బొమ్మల రచన రంజకి మునుఁగులీలఁ
జేతిలోమొక్క కుంచెగాఁ జెన్నుమీఱ
నూహ్పలోన మైమఱచె నాయువిద యపుడు;

"జలతరంగిణి" మించిన లలితమైన
మెలఁగుతోఁ బాడుచుండె నా కలికిమిన్న,
కమ్మపాటకు వలయు నంగమ్ములెల్లఁ
గోరకుండఁగనే సమకూడె నచట;

నిండి తొనఁకుచు శ్రుతిపైచె సీటికాల్వ,
వెనుకఁ జిఱుతలు వాయించెఁ బెద్దకప్ప,
బుఱ్ఱనూపెడు తొండయు గొఱ్ఱెమీఁద
స్వారిఁ జేయు కత్తెర* వినువారలైరి;

ఎంతసేపట్లు వింటినో యెఱుకపడదు
గాని పికిలిపిట్టలవంకఁ గనులు త్రిప్పి
మరలఁ జూచిన నాచోట మగువలేదు
పలుకులునుమమ్ములును గాలివాతఁబడియె;

దీపమాఱిన యిల్లట్లు లాపెలేని
చేను గన్పట్టె నావేళఁ జెన్నువీడి.
పాటకొఱకామె వెనువెంటఁ బడియెనేమొ
కప్పగాని కత్తెరగాని కానరాము;

ఏ.టింశ. కత్తెరపిట్ట.

ఆమెపాడుచు నూడ్చుచున్నంత నేవు
సంతసమ్మునఁ దలలూఁచి యెంతొమెచ్చి
పోయినంతనె చింతచేఁ బొగులుపోల్కి
కనుగొనలనుండి వరినారు కార్చె నీరు;

పాటకుప్పొంగిపోయిన నీటికాల్వ
గట్టుతోరసుకవచ్చి యాకలికిలేమి
నుస్సురంచును బెద్ద నిట్టూర్పు విడిచె.
ఆమెపై దానికెంత మోహమ్మొకాని;

సందెలను నాకుపచ్చని చదలఁదోఁచి
తొలఁగిపోవు కుంకుమ మబ్బుతునుకవోలె.
ఇలకు దిగివచ్చి వెడలిన యింద్రచాప
మట్లు వరిచేలలో మాయమయ్యె నతివ.

# కోకిల

కమ్రమాకందపాదపాగ్రములనుండి
కోకిలా ! భవ్యభవదీయ "కూ" స్వనమ్ము
మారుతతరంగముల దూసి మఱలమఱల
శ్రవణపర్వమ్ముగా సాఁగు సమయమందుఁ
జెవులు రిక్కించి పర్వతశ్రేణికూడఁ
దనివితీరఁగ గానామృతమ్ము నాని
వాగ్విహీనములయ్యెఁ దావక సుగాన
మహిమఁ గూయనఁ గల్గుగా మాటనేర్చి.

# సాయంకాలము : వెన్నెలరాత్రి

ఇనుఁడు గగనాబ్ధిలో నీదియీది బడలి
చరమ గిరికూటమున కేఁగు సమయమందుఁ
బ్రకృతిసౌందర్యముం జూడ బయలుదేరి
కూరుచుంటిని మా పల్లెటూరి బయల;

సంజలఁ బట్టు మేఘముల చక్కని రంగులు దోఁపఁ గింకిణీ
శింజితముల్ వినంబడె విశేషవికాసముఁ జూపు మల్లికా
కుంజములందుఁ; బ్రేయసియుఁ గూడె ననుం జలితాభ్రమాలిక
మంజువినీలకాంతి పలుమారులు గొండలఁ దోఁచు రోజునన్;

ఇద్దరముఁ గూడి యచ్చోట నేకతమున
వివిధదృశ్యములను నిరూపించుచుండ
ముసలి ప్రకృతియుఁ జీఁకటి ముసుఁగువైవఁ
దారకలతోడఁ జందురుండు తరలివచ్చె;

రేయి యంతకంతకు వెండిరేయియయ్యె
వెల్లవలువల మేము వెండివిగ్ర
హములుగా మారిపోయితి మఖిలభూమి
గడియలోపల వెండిలోకముగఁ దోఁచె;

రమణీయంబగు వృక్షవాటికలలో రాజిల్లు శృంగార ప
త్రములంజొచ్చిన చంద్రికావితతి చేతఃప్రీతిఁగల్పింపఁ జం
క్రమముల్ సల్పితి వెండిలోకమున భార్యంగూడి యిచ్ఛావిధిన్
విమలాంభఃపరిపూర్ణనిర్ఝరతటీవేదీసమీపస్థలిన్;

తక్కువమనియెడు వివిధపత్రములఁజూచి
వెండి కొబ్బరిఱేకుల వెలుఁగునరసి
జలముపైఁదేలు వెండిఱేకులను గాంచి
ప్రేయసిని గూడియింటికి వెడలిపోతి.

# ఇంద్రచాపము

అంకితము
భార్యకు

" దేవదేవుని జింతించు దినము దినము
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు".

౩౫

# వేఁడికోలు

ఈవు సృజియించితివిగావె యింద్రధనువు.
ఏను నిర్మించినాఁడ నీ యింద్రధనువు.
యుష్మదీయమ్ము కాంతిలు వ్యోమవీథి
నస్మదీయమ్ము నవ్యకావ్యాంబరమున
వివిధవర్ణమ్ము లీన దీపింపు తండ్రి.

# నా పాట

ఆమహర్షివాల్మీకి, తిమ్మనయుఁ, గాళి
దాసు, భవభూతి, పెద్దన, దండి, భట్టు
మూర్తి, కృష్ణరాయ, రవీంద్ర, పోతనాది
భరతదేశకవీశులు, భక్తులైన
పరిధితపాశ్చాత్యకవులును రమ్యగాన
ఫణితు లెన్నెన్నొ రహివుట్టఁ బాడిపాడి
మెట్లు సవరించి శ్రుతిగల్పి మేటిప్రేమఁ
బంపినారు నాకీ కవిత్వంపు వీణ;
దానిపైఁ బాడుచున్న నాతత్వగాన
మాలకింపరొ విద్వాంసులైన జనులు ?

# పాఠము

సర్వసర్వంసహాచక్రిచంక్రమణగృ
హీతవిస్తారజలక్షణప్రీతమేఘ
మూర్తి! రమ్మటంచాషాఢ ముఖమునందుఁ
బల్కుచుంటినిదే ప్రియస్వాగతమ్ము!
నీవు నానా నదీనద జీవనంపు
భారమున మేదినీ సమీపముగ వ్రేలి
నిశితదాహార్తి శుష్కావనీతలమ్ము
శీతలామృతాసారనిషేచనమునఁ
బ్రశమితమ్మును నుదితాంకురమ్మొనర్చి
కంకణోత్సర్గలఘు సితాకారమొంది
స్వర్గపట్టణోపాంతసంచారివగుచు
నాకు మార్గదర్శకుఁడవైనాడవయ్య !
వివిధదేశ సారస్వతాన్వేషణమున
నేనుగూడ నీవలె గ్రహించుకొనిన
బహుళ భావార్థభరమున వంగివంగి
రసపిపాసిత మానవప్రకర ముఖము
లాత్త హర్షవశమ్మున నందగింప
జల్లివైతు సర్వార్థముల్ జల్లివై వఁ
దోషితాత్ముడఁ గీర్తిమంతుండ నగుచు
దేవదర్శనభాగ్య సంతృప్తిఁ గననా ?

# మిత్రద్రోహము

అనుదివసలంబమానగాఢాంధకార
కాలకూపాన నవమాస కఠినశిక్ష
ననుభవించి దర్శించితి దినముఖమ్ముఁ
బ్రీతినష్టాంగయుత నమస్కృతియొనర్చి;
ఆదినమ్మె జొచ్చిరి మదీయాలయమ్ము
హితులమంచును గొందఱు హీనమతులు,
సఖులకై వాచిపోయెడి జనుఁడఁగాన
జీవనమె ధారవోసి పోషించినాఁడ,
నెలలుపోయె సంవత్సరమ్ములు గతించె
మిత్రులే నిశాంతమ్మున శత్రులగుచు,
నన్నుమెల్లన బంధించి నాముఖమ్ము
ద్రిప్పఁజూచిరి నిన్ను దర్శింతుననుచు;
నేఁబరమభక్తుఁడనుగాఁగ నేఁటినుండి
త్వరితతర విజృంభితగృహాంతరబలిష్ఠ
శత్రుమర్దనసత్వమ్మొసంగు తండ్రి!

# కోరిక

ధ్వాంతమాలాపరీవృతధరణితలము
భర్మతూలికాశుభగ సంస్పర్శనమున
స్వర్ణభూమిగఁదోఁచు విభాతవేళ
నిన్నుఁబూజించు కరముల నిమ్ముతండ్రి.

గాఢతమనీలపరిణాహగగనసీమ
బాణయుతకార్ముకముఁబోలి పక్షిరాజు
వలయములుచుట్టి మెల్లనబాఱువేళ
నిన్నుఁగీర్తించు కంఠమ్ము నిమ్ముతండ్రి.

యక్షమిత్రోపదిష్ట నీలాంబుదమ్ము
శంకరార్ద్రనాగాజినేచ్ఛను హరింప
రక్తకాంతిఁబొందెడు పవిత్రంపువేళ
నిన్నుఁబ్రార్థించు చిత్తమ్ము నిమ్ముతండ్రి.

చారుతరమైన చుక్కలచీరఁగట్టి
రాత్రిసుందరి మోహనరాగవితతి
నింపుగా వెండివీణ వాయించువేళ
నిన్నుఁదలఁచుచు శయనింప నిమ్ముతండ్రి.

# అంజలి

ఘనపాటచ్చరసంగృహీతజలముక్తాశ్రేణి జామాతయా
వనధిం జెంద మహీధరశ్వశురుడున్ వైరమ్మునం జోర వ
ర్తనముల్ బాపెడు శృంగహస్తపునిరోధమ్ముల్ ప్రయోగించి నా
డనఁగన్ జాఱె ధరాధరాశ్రితవినీలాంభోదవర్షాంబువుల్;

శుద్ధపత్రిజలస్నాతశుకమనోహ
రారవము వినంబడ సమాయాతయాత
మందపవమానజనితమై మహికి దిగియెఁ
బడుగుపేకలతో వర్షవస్త్ర మొందు;

విస్తృతాజ్ఞానతిమిరమ్ము వీడిపోవ
జ్ఞానభాస్కరుఁ డుదయించి నాడనంగ
సాంద్రపర్జన్యపటలమ్ము సంచలింప
నభ్రవీథి గాన్పించె సాయాహ్నతరణి;

తళుకుంబంగరు కీల్జడల్ గురుల సందానించి పేరోలగం
బలరుం బోణులు గూడి గాయకవతంసాలాపితానేకకా
కలిగీతావళి మెచ్చి చేసెడి శిరఃకంపమ్ము నా సారె నా
దలలాడించె సమీరసంచలితకేదారస్థశాల్యోఘముల్.

ఖరమైపోయిన నవ్యపత్తనసదావాసమ్ము చేత న్నిరం
తరబాధావిలమానసం బవిరళానందమ్ము భూభృత్సహో
దరసందర్శనమందుఁ బొందె; విస్తృతధ్వాంతమ్మునం బుష్పబం
ధురవల్లీధరణీధరాగ్రితరుసందోహమ్ము మాటొందగన్.

ప్రాగ్దిశాదేవగేహతారాధినాథ
కాంస్యజయఘంట మెఱయఁ దత్కాంతి నభము,
ఖండఖండాంతరములు, దుర్గమపయోధి,
దాటి యీకవిదేహమ్ముఁ దాకినంత;

వెలుఁగుచీకట్ల సుఖదుఃఖములను ముంచి
జననమరణంపు ద్వారాలఁ జొనిపితేల్చి
జనులఁ దనసన్నిధినిజేర్చు జనకుదివ్య
సృష్టిచిత్రమ్ము మది నావహించి మించ;

అక్షులు మఱంగె బాధిర్య మందె చెవులు,
స్పర్శనశియించి మెయి జడత్వమ్ము నొందె
ముకుళితదినాంతసుందరాంభోజ మటులఁ
దెలియకుండనె చేతులు కలిసిపోయె.

# ద్వీపాంతర వాసము

అదిగో ! భవదీయదివ్యతమాంఘ్రిభాగ్య
చక్రిచిహ్నితసురనదీ సైకతమ్ము.
అవిగో ! ఘనసౌరభేయీమహానినాద
ముఖరమందారవృక్షసమూహసీమ.
అదిగో ! చంపకపారిజాతాదిగంధ
గాన మధురిమోద్గారి ప్రసూనభూమి;

.... .... . .. .... .... .... .... .... ....

ఆపవిత్రప్రదేశవిహారమెడలి
ఆవిశాలప్రదేశవాహ్యాళిదొలఁగి
జన్మపర్యంతకఠినశిక్షలనుబొంద
మృత్తికాభిత్తికావినిర్మితనిబంధ
నాలయమ్ముల. నిచట. ద్వీపాంతరమున
నేను యుగములనుండి బంధితుఁడనగుచు
నిన్నుఁగనఁ జేయు విద్యల మిన్నయుంచుఁ
గవితఁజెప్పంగ నేర్చితిఁగాంక్షతోడ
అధికతరతాపశుష్కదేహమ్ముప్రిల
ధరణిరజమునవిండు పాదములునొవ్వ
నెన్నిసోపానపంక్తులో యెక్కియెక్కి
చంద్రశాలనుగని చేయిఁజాపినాడ
నందికొనవయ్య తండ్రి ! నీయంకమునకు;
జనకపరిచితవదనదర్శనము లేక
యీ సుదూరదేశమ్మున నేడ్చుచున్న
నన్నుఁబోలిన శిక్షితులున్నవారు
వారలంగూడ నాతోడఁబరమకరుణ
నందికొనవయ్య తండ్రి ! నీ యంకమునకు.

# సముద్ర తీరమున

పశ్చిమాశాతపస్వినీస్వప్నరాజ
మనెడు మలుసంజ యంతలో నంతరింపఁ
దరళతారకాదీపికాతతులు వెలుఁగు
నవసరంబయ్యె గగనదేవాలయమున;

అనుదినమ్మును మాతృదేహమ్ము నొరసి
యచ్ఛకేతనహస్తులై యాటలాడు
పోతబాలురు సుఖనిద్రఁబోయిరిపుడె
చటులసాగరవీచికోత్సంగమందు;

ఈమనోహరవేళ నుద్దామమైన
భక్తిభావముల్ నాలోనఁ బాదుకొనఁగ
నభ్రదేవళప్రాచ్యకుడ్యమ్మునందు
వెండిగడియార మల్లదే వ్రేలుచుండె;

చంద్రసందర్శనోదితోత్సాహుఁడైన
యీసముద్రుండు పరవశుఁడై సహస్ర
బాహువులనెత్తి, యెల్గెత్తిపాడు, నూఁగు
నవ్వు, నర్తించు, సాష్టాంగనతు లొనర్చు;

నాహృదినిబుట్టె నిర్భరానంద మిపుడు
ఈ జలధివోలె జ్యోతికై యేనుగూడ
బాహువులనెత్తి. యెల్గెత్తి పాడి. యూఁగి
నవ్వి. దాడుదు. సాష్టాంగనతు లొనర్తు.

ఇంద్రచాపము సమాప్తము.

# నిషాదుఁడు

నిఖిలలోకసతీస్తవనీయలలిత
లలితసీతాపహరణపలాయమాన
రూక్షరావణదనుజస్వరూప మూని
చంచలాసంయుతాభీల జలధరమ్ము
దక్షిణాపథమార్గానఁ దరలఁదోఁచెఁ
దతజటాయుగరుచ్ఛోణితమ్ముభాతి
నంబరమ్మున రక్తిమాడంబరమ్ము:
క్షైత్రియాత్రాసమాగతసైన్యమనఁగ
నమితగర్వాంకభుగ్నకంఠములతోడ
వామదక్షిణపదముల వరుసలొప్ప
బాతువులు గేహముఖముగఁ బయనమయ్యె;
గోపకగురుండు పశుశిష్యకోటిఁగూడి
ప్రకృతిపాఠశాలను వీడి పల్లెకేఁగె.
వెల్గుచున్నవిద్యుద్దీపవితతిగల్గు
పురమువలెనున్న నూజేను పొనుఁగుపడియె.
కర్షకకవీశ్వరలిఖితాక్షరములనఁగ
సీరపథములుగాన్పించు క్షేత్రమందు
సంచరింపుచునుండ నిషాదబాణ
హతబలాకమ్ము దీర్ఘశోకారవమ్ము
సేయుచును బ్రాణములు గోలుపోయె నెదుట;
"మానిషాద" సుశ్లోకము మనముఁదట్టి
యశ్రుధారాప్రపాతమ్మయ్యెఁగాని
ఏను వాల్మీకినే శపియింప నతని ?

# రాజదర్శనము

రాజకవిరాజ ! మీకు నీరాజనమ్ము.
పండితోత్తమ ! మన్ననోవాకమయ్య.
దానకర్ణా ! సురభిపుష్పదామ మిదుగో.
జయపురాధీశ్వరా ! మీకు జయము, జయము !!!

కవితయుఁ జిత్రలేఖనము గానమునాఁ బడు సత్కళల్ మహీ
ధవ ! తవమానసమ్మునకుఁ దద్దయుఁ బ్రీతికరమ్ములంచు మ
త్కవనముఁ జిత్రలేఖనము గానముఁ జూపి వరమ్ములంద న
త్సవముగ నేఁగుదెంచితిని దర్శనమిచ్చి వినంగదే ప్రభూ !

ఏడుంగొండల వేంకటేశజనకుం డేరీతి నుత్కంఠమైఁ
జూడంబోయెడి తైర్థికాళికి మహాచోద్యంపుటాహార్యముల్
క్రీడోన్మత్తవిహంగముల్ లతలు సారెన్ జూపు మున్నాడి యా
జాడన్ మీరను నాకుఁ జూపితిరి రాజా ! చిత్తముప్పొంగెడిన్ ;

జయపురరాజదర్శనము సత్వరమబ్బును గాన మేఖలా
చయగుర్రు వక్రమార్గముల సాఁగుజనాళికి స్వర్గసీమకున్
రయమున బొందితోడఁ బయనమ్మొనరించు విధమ్ముదోఁచు ని
శ్చయముగ మీరలందఱును సజ్జనులున్ మరి స్వేదశూన్యులున్.

కవితయందును జిత్రలేఖనమునందు
గానమందును నభిరుచి గలదుకాని
కలుగుదుస్థితులందు నీ లలితకళలు
వర్ధిలవుకదా విక్రమవర్మదేవ!

దేవభాషాపరీక్ష నుత్తీర్ణుఁడనయి
పండితులపాటు నుద్యోగవశతఁబడుచు
నేకవింశతి వర్షము లేకదుఃఖ
ముగ విలాపించితిఁ గళలు మునిఁగెనందు;

భూధరముపైకి బండఁగొంపోయినట్లు
తీఁగనొండు కమ్మచ్చున లాగినట్లు
మాపరిభుత్వమ్ము గాఢాభిమానమూని
నిడుద నిశ్రేణిపై నన్ను నిల్పినారు.

ఆఱిపోయె నుద్యోగదుఃఖాగ్నిశిఖల
టంచుఁ గవితామృతాప్లావ మాచరింపఁ
గావ్యరచనమ్మొనర్చితిఁగాని నిండు
గృహము గుల్లయౌనని గ్రహియింపనైతి;

ఆడబిడ్డలకైనను నత్తకైన
సకలసేవలుసేయు విశాలహృదయ
దోసిళుల బిచ్చమిచ్చిన తోయజాక్షి,
దృఢశరీర, స్రుక్కెను ముప్పదేండ్లునిండ;

కౌగిలింతకు నందని కాంతతనువు
సన్నగిలి కప్పురపుబొమ్మ చందమాయె
గానమధురిమఁ గురిసిన చానమధుర
కంఠము గుసగుసలువల్కెఁ గాలమహిమ;

రాజునే నేను? నాభార్య రాజయక్ష్మ
వెజ్జులంబెట్టి వేనకువేలు ధనము
ఖర్చుసేయ నుపాధ్యాయకవినిగాని
యక్కతమ్మున నీవ్యాధి యంతమగునె ?

బ్రతికియుండియు నస్పృశ్యురాలు భార్య
జాయగల్గియు నే బ్రహ్మచారినైతి,
భగిని యున్మాదదశయందు సగముప్రాణ
ములను వదలిన జనని మమ్ములనుసాఁకు;

జనకుంబోలిన కన్యయంచు మిముఁబెన్ సౌందర్యసంపన్నురా లనుచున్ బ్రాహ్మణరాజవంశమున మర్యాదాతిరేకమ్ము నే ర్చిన దంచాయతనేత్రముల్ గలుగు పుత్రీపుత్రులన్ గాంచ న న్వనితన్ బెండిలియాడినన్ గలిగె నిర్వంశమ్ము రాజోత్తమా!

పిల్లలేలేరు నీకేమివ్రేఁగటంచుఁ
బల్కుచుందురుగాని మా బంధుజనులు
వెయ్యిపిల్లల సమము నావెఱ్ఱిచెల్లె
లిల్లు సిందరవందర యేమిచెపుదు;

ఒకవంక సోదరీయున్మాదభీకరా
    కారసమేతఝూంకారరవము.
ఒకచక్కి వృద్ధమాత్రాద్యుత్తహృద్రోగ
    నరకబాధాతిదీనస్వనమ్ము.
ఒకచోట రాజయక్ష్మోదగ్రనక్రవ
    క్రగ్రస్తమత్సఖీకాసరవళి,
ఒకచాయ నస్మదీయోద్యోగసంతాప
    సంజాతబహుళనిశ్వాసచయము,

జననిపోవునో ప్రియమైన జాయముందు
పోవునోయను భయమెంతో పుట్టుచుండు,
నిటుల భయదుఃఖవిహ్వలహృదయదర్ప
ణమ్మునఁ బడునె వాణిపూర్ణాననమ్ము ?

రమణీయంబుగఁ గుంభకావళులు శీర్షంబందు నిర్మించి సం
భ్రమమేపారఁగ నొక్కఁడైనను నధఃపాతమ్ముగాకుండ ను
త్తమనృత్తమ్ములు నేర్పుమై సలుపు విద్యావంతు రీతిన్ మదీ
యము చిత్తమ్ముఁగవిత్వమందునిచి కావ్యాలాపముం జేసితిన్.

# స వ ర ణ

| పుట | | |
|---|---|---|
| ౧ | (విజ్ఞప్తిలో) | వానిపై |
| ౭ | | చేనుబిడ్డల |
| ౧౭ | | పూవుఁజెవులతో |
| ౨౬ | | వెల్లమొఁగిలుదూది |
| ౨౯ | | నాగుజోడును |
| ౩౦ | | పలుకుసుమములు నాగాలి కత్తెరపిట్ట |
| ౩౬ | | శోభిలు (కాంతిలు) |
| ౩౯ | | చొచ్చిరి |
| ౪౫ | | నగుదు, నాటుదు |
| ౪౯ | | కౌఁగిలి |
| ౫౦ | | సోదరియున్మాద |

" Poetry and Pessimism do not mix; Poetry is fire—, pessimism is cold water. Life in literature as in life itself must be positive and joyful "

James H. Cousins.

శ్రీ వేదవ్యాస ప్రెస్. విజయనగరం—1000—1949.